మిథున బుధదశాయాం వృషభశుక్రభుక్తిమాసములు
౨౦ దినం ౩౫ గడె ౩౫ కి ఫలం.

మూ॥ ముక్తాజలంసుతప్రాప్తి మశ్వారోహణసంభవం।
స్త్రీలాభంధనలాభంచసౌమ్యే భృగుదశాగమే ॥౪౭॥

తా॥ మిథునబుధదశ శుక్రభుక్తిలో- ముత్యముల లాభమును పుత్రసంభవము-అశ్వారోహణప్రాప్తియు- స్త్రీలాభముధనలాభమును-గలుగును॥ 8

మిథున బుధ దశాయాం మిథునబుధభుక్తి మాసములు
౧౧ దినం ౨౦ గడియలు ౧౮కి ఫలం 9

మూ॥మ్యాతవాణిజ్యవిప్రాత్తైర్వస్త్రైస్త్రైశ్వర్యసుసంపదః।
సౌభాగ్యంచసుపుత్రాప్తిం సౌమ్యేబుధదశాగమే ॥౪౮॥

తా॥ మిథునబుధదశయందు మిథునబుధభుక్తివచ్చెనేని- జాతకుడు సుచశ్శ్వమును- సుపుత్రప్రాప్తిని- జూదముచే బేరముచే బ్రాహ్మణులుమొదలుగువారిచే సంపాదింబడిన యైశ్వర్యముగలవాడగుననుట॥

సవ్యమిథున బుధచక్రదశా సమాప్తా.

---

సవ్యకటకచంద్రచక్రదశావర్షాః- ౨౧ తత్ఫలం.

మూ॥ వస్త్రస్త్రీప్రాప్తించ ధర్మంచ పూర్ణచంద్రేశుభావహం। సౌభాగ్యంపుత్రలాభంచరత్నాభరణసిద్ధిదం। క్షీరపానంస్త్రీయాస్నేహంపాయసాన్నప్రియంతథా।సంభోగయువతీచైవకర్కటస్థేకశాసిధా ॥ ॥౪౯॥

తా॥ కర్కటక చక్రమందు పూర్ణచంద్రుడుండెనేని యాదశయందు వస్త్రస్త్రీలాభము- ధర్మబుద్ధియు- శుభముగలుగుట- సౌభాగ్యసమృద్ధియు- పుత్రప్రాప్తియు- రత్నాభరణసిద్ధియు- క్షీరపానము- యువతీస్నేహము- పాయసాన్నప్రియము- రతినహిత్యమైక్యమువగియునుగలుగుననుట॥

క్షీణచంద్రదశాఫలం.

మూ॥ జ్వరరోగందివాస్వాపంవీతభార్యభయంతథా।
సురాపానంప్రియంకష్టంకర్కటస్థితనావిధా ॥౫౦॥

తా॥ క్షీణచంద్రదశయందు- జ్వరరోగమును- పగటినిద్రయను- విడువబడినభార్యవలని భయమును సురాపానమందు ప్రియమును, మిక్కిలికష్టమును- గాయమును గలుగును॥

భుక్తివాక్యం॥ వాణీవస్తుంధధినత్పుత్రః॥ కటకోదేహాః- మీనంజీవః॥

భుక్తులఫలములు- ధ్రువం నెల ౨ ది ౨౭ గ ౫౪ వి గ ౨౫.

కటకచంద్ర చక్రదశాయాం కటక భుక్తి మాసములు
౬౧ దినం ౧౬ గడియలు ౩కి ఫలం.

మూ॥ నృపాలాదర్థలాభంచవరనారీంసుపుత్రకమ్। లో
కఖ్యాతింమహత్సౌఖ్యంచంద్రేచంద్రదశాగమే॥ ॥౫౧॥

తా॥ చంద్రదశాచంద్రభుక్తియందు రాజువలనధనలాభము, మంచికోడుకు లును గుణవతియైనయువతియు, లోకఖ్యాతినిమిక్కిలిసౌఖ్యమునుపొందును॥

కటకచంద్ర దశాయాం సింహరవిభుక్తిమాసము
౧౪ దినం ౧౯ గడియలు ౩౨కి ఫలం.

మూ॥ శత్రునాశంప్రతాపంచ నిరోగత్వంధనాగమం। స
దావిజయమాప్నోతిచంద్రేసూర్యదశాగమె ॥౫౬॥

తా॥ చంద్రదశయందు సూర్యభుక్తివచ్చెనేని- శత్రునాశనము శౌర్యము రోగము లేమియును- ధనప్రాప్తియు యల్లప్పుడు జయమునుపొందును.

కటకచంద్ర దశాయాం కన్యాబుధ భుక్తిమాసములు
౨౬ దినం ౧౧ గడియలు ౧౦కి ఫలం.

మూ॥ ఐశ్వర్యమతులంసౌఖ్యంగజాశ్వధనలాభదం। పుత్ర
మిత్రకళత్రాదీశ్చంద్రేబుధదశాగమె॥ ॥౫౭॥

తా॥ చంద్రదశయందు కన్యాబుధ భుక్తివచ్చెనేని- తక్కువగానియైశ్వ ర్యమును సౌఖ్యమును- యేనుగలు గుర్రములు- ధనమువీటియొక్కలాభము ను- పుత్రులను- మిత్రులనుభార్యమొదలగు బంధువులనిచ్చుననుట॥

కటకచంద్రదశాయాం తులాశుక్ర భుక్తిమాసములు
౧౬ దినం ౨౬ గడియలు ౩౦కి ఫలం.

మూ॥ యానప్రదంచభూపత్వం బహుపత్నిసమాగమం।
రజితంవస్త్రలాభంచచంద్రేభృగుదశాగమె ॥౫౮॥

తా॥ చంద్రదశయందు శుక్రభుక్తివచ్చెనేని ఆందోళనప్రాప్తియు- భూపత్వమును- బహుపత్నిసంయోగమును- వెండియును- వస్త్రప్రాప్తి ని యిచ్చుననుట.

కటకచంద్రదశాయాం వృశ్చికకుజ భుక్తిమాసములు
౨౦ దినం ౧౫ గడియలు ౨౧కి ఫలం.

మూ॥ విషబాధాం మహాక్లేశంధనవస్త్రవిహీనతాం।
విద్యానాశం బంధునాశం చంద్రేకుజదశాగతె ॥౫౯॥

తా॥ చంద్రదశయందు కుజభుక్తివచ్చేనేని విషబాధను ధననాశనమును- వస్త్రహీనత్వమును- విద్యావిహీనతయును- బంధుక్షయమును చేయును॥

కటకచంద్ర దశాయాం చాపగురుభుక్తి మాసములు
౪ దినం ౯ గడియలు ౪౮కి ఫలం.

మూ॥ విషనాశంమనోధైర్యంబహుస్త్రీపుత్రసంయుతం ।
విద్యాలాభంబంధుసౌఖ్యంచంద్రేజీవదశాగమె ॥౫౮॥

తా ॥ చంద్రదశయందు గురుభుక్తివచ్చేనేని విషధ్వంసమును- మనోధైర్యమును, పలుపుత్రస్త్రీలతోడను కొడుకులతోడను కూడికయును- విద్యాలాభమును, బంధుసౌఖ్యమును జేసుననుట.

కటకచంద్రదశాయాం మకరశని భుక్తిమాసములు
౧౧ దినం ౨౧ గడియలు ౩౮కి ఫలం.

మూ॥ కారాగృహగతంబంధుంవ్యసనంరోగసంభవం। పు
త్రనాశంమనస్తాపంచంద్రేమందదశాగతె ॥ ॥౫౯॥

తా ॥ చంద్రదశయందు శనిభుక్తివచ్చేనేని- కారాగృహ ప్రవేశమును, దాసుబంధకమును, విషయాసక్తిని, రోగసంభవమును- పుత్రనాశమును మనోవ్యసనమునునిచ్చును.

కటకచంద్రదశాయాం కుంభశని భుక్తిమాసములు
౧౧ దినం ౨౧ గడియలు ౩౮కి ఫలం.
మకరశనిభుక్తిఫల॥ మకరశనిభుక్తిఫలమేను.

కటకచంద్ర దశాయాం మీనగురుభుక్తిమాసములు
౪ దినం ౯ గడియలు ౪౮కి ఫలం.

మూ॥ విద్యాజ్ఞనృపజనైఃపూజాం పుత్రోత్పత్తిం సుఖంత
దా। ధనధాన్యసమృద్ధించచంద్రేగురుదశాగతె ॥౬౦॥

తా॥ చంద్రదశయందు మీనగురుభుక్తివచ్చేనేని- జాతకుడు విద్వాంసుడగుచు రాజుచేతను, జనులుచేతను- పూజను పుత్రోత్పత్తిని- సుఖమును-ధనధాన్యసమృద్ధినిబోందుననుట.

సవ్య కటకచంద్రదశా సమాప్తా.

---

సవ్యసింహరవిచక్ర దశావర్షాణి ౫ తత్ఫలం.

మూ॥ సింహాదిత్యేపుత్రనాశంనాశంక్షేత్రస్యభార్యయా ।
జలప్రమేహారోగాచ్చపైత్యరోగాద్భయంతథా॥ గ్రహణీ

మూలరోగంచసూర్యచక్రఫలంలభేత్ ॥ ||౫౯||

తా ॥ సింహమునుపొందిన రవిదశయందు పుత్రనాశనమును- భార్యచే భూనాశనమును- నీరుచురుకు- ప్రమేహరోగము యీరోగమువలనగాని- పైత్యరోగము వలనగాని భయమును- గ్రహణీరోగమును- మూలవ్యాధి నిపొందుట.

భుక్తివాక్యం॥ హంసశ్చవశాంబరపత్రం॥ వృశ్చికోదేహః- మీనంజీవః॥

భుక్త్యఫలములు- ధృవందిన ౧౮-౫_౦.

సింహరవిదశాయామాదౌవృశ్చికకుజభుక్తిమాసములు-౪౬౬౯ఫలం॥

మూ॥ సువర్ణవిద్రుమాదీనిలభేద్యుద్ధమహాజయం । సాహ

సంతామ్రపాత్రంచసూర్యేభౌమదశాగమె ॥౬౦॥

తా॥ సింహరవిదశయందు వృశ్చికకుజభుక్తివచ్చెనేని_ బంగారము- పగడములుమొదలగునదియును-యుద్ధమందుజయమును- తెంపును-రాగిపాత్రలును పొందును.

సింహరవి దశాయాం తులాశుక్రభుక్తి మాసములు

౯ దినం ౧౮ గడియలు ౧కి ఫలం.

మూ॥ విషదాహంపుత్రనాశంజ్వరంచపశునాశనం । దేశ

త్యాగంమహాదుఃఖంసూర్యేశుక్రదశాగమె॥ ||౬౧||

తా॥ రవిదశలో శుక్రభుక్తివచ్చెనేని- విషభక్షణచే తాపమును- పుత్రనాశనమును- జ్వర సంభవమును- పశునాశనమును_ దేశత్యాగమును- మిక్కిలి దుఃఖమును కలుగుననుట.

సింహరవిదశాయాం కన్యాబుధభుక్తిమాసములు ౪ది౧౬కి ఫలం.

మూ॥ గమనంకార్యలాభంచ దేవబ్రాంహణపూజనం। రో

గంచబంధునాశంచరవౌబుధదశాగమె ॥ ||౬౨||

తా ॥ రవిదశయందు కన్యాబుధభుక్తి వచ్చెనేని. తిప్పటయును కార్యసిద్ధియును దేవబ్రాహ్మణపూజయునురోగబాధయునుబంధునాశనమునిచ్చును.

సవ్య మండూకగతిః.

దశాతి సం ౧ నె ౭ దిర మీదట మండూకగతిఫలం.

మూ॥కన్యాయాఃకర్కటెయాతెమాతృబంధువధూమృతిః।

ప్రవాసంరోగపీడాంచబంధుభిఃకలహంతదా ॥౬౩॥

తా॥ భుక్తినాథుడు కన్యనుండి కర్కటకమునకు జేరెనేని- తల్లియు బంధువులు- పెండ్లికూతురు వీరియొక్క-మరణమును, సంసారముతో కొత్తచో

టికిబోవుటయును- రోగ ... ను- బంధువులతోకలహమునిచ్చును, నిదివా
సవ్యామండూకగతిఫలము.

సింహరవిదశాయాంకటకచంద్రభుక్తిమాసములు- ౧-౧ కి ఫలం॥ 4

మూ॥ శత్రునాశంప్రతాపాచ్చ నిరోగత్వంధనాగమం।

సదావిజయమాప్నోతిసూర్యేచంద్రదశాగతే ॥౬౪॥

తా॥ సూర్యునదశయందుచంద్రభుక్తివచ్చేనేని - శౌర్యాతిశయమువలనశ
త్రునాశనమును - రోగరాహిత్యమును- నెల్లప్పుడువిజయమును-పొందు
చుండుననుట ॥

సవ్యసర్పగతిః.

దశాదిసం- ౨ నె ౬ ది-౨రమీదసర్పగతిఫలం.

మూ॥ కటకాచ్చహరౌయాతెపీడాంభవతి దేహినాం । ధ
నధాన్యవినాశంచశిరోరోగంమనోరుజం ॥ ॥౬౫॥

తా॥ భుక్తినాథుడుకటమునుండిసింహమునకుజేరెనేనిసర్పగతియనిపేరు-
అందుశుభఫలము- దేహులకుపీడబాధయు- ధనధాన్యము మొదలగువానికి
నాశనము-శిరోరోగమును-మనోవ్యాధియునుపొందును ॥ 5

సింహరవిదశాయాం సింహరవిభుక్తి మాసములు- ౩కి ఫలం.

మూ॥ బహుప్రఖ్యాతిమాప్నోతిపూర్వవిత్తసమాగమం।

పుత్రోత్పత్తింద్రవ్యలాభంసూర్యేసూర్యదశాగమె ॥౬౬॥

తా॥ సింహరవిచక్రమందు రవిభుక్తివచ్చేనేని-మిక్కిలి కీర్తియును-నష్ట
ద్రవ్యలాభమును- పుత్రోత్పత్తిని- ద్రవ్యలాభమును బొందును.

పునః మండూకగతిః.

దశాదిసంవత్సరములు ౨ నె౧౦ ది-౨రమీదట మండూకగతిఫలం.

మూ॥సింహాచ్చమిథునేయాతెస్వస్త్రీవ్యాధిమృతిర్భవేత్।

విదేశగమనంయాత్రాఉత్తరా దిశిగచ్ఛతి ॥౬౭॥ 6

తా॥ భుక్తినాథుడు సింహమునుండి మిథునమునకుమండూకగతినిజేరెనే
ని, తనభార్యకువ్యాధిచే మృతియును, విదేశగమనమైనను- ఉత్తరయాత్ర
మైనను గలుగును.

సింహరవిదశాయాం మిథునబుధభుక్తిమాసములు- ౮ ది౧-కి-ఫలం॥

మూ॥ ధనజ్ఞానాంగనాశత్వంకర్మదోషసముద్భవం। శత్రు 7
బాధార్థనాశంచరవౌబుధదశాగతె ॥ ॥౬౮॥

తా॥ రవిదశయందు మిథునబుధభుక్తివచ్చేనేని ధననాశమును జ్ఞానానా

శమునంగవై కల్యమును - బూర్వజన్మకర్మమునన్నైదైననొకదోషము గలుగుటయును- శత్రుబాధచే ధననాశనమును జేయుననుట॥

సింహరవిదశాయాం వృషభశుక్రభుక్తి మాసములు-౯ది౧౮కిఫలం.

మూ॥ శీతజ్వరంశూలరోగం దేశత్యాగంమహావ్యధాం। రా
జపీడాధననాశః స్యాత్సూర్యే శుక్రదశాగతే ॥౬౯॥

తా॥ సింహరవిదశయందు వృషభశుక్రభుక్తి వచ్చెనేని- శీతజ్వరము- శూలరోగమును- దేశత్యాగమును- మహావ్యధయును- రాజులయొక్క బాధచేద్రవ్యనాశమును గలుగును॥

సింహరవిదశాయాం మేషకుజభుక్తి మాసములు-౪ ది ౬కి, ఫలం

మూ॥ వ్యాధితో బంధుపీడాంచ దేశత్యాగం రిపోర్భయం।
చండప్రతాపనాశంచ భానౌ భౌమదశాగమె ॥౭౦॥

తా॥ సూర్యదశయందు కుజభుక్తి వచ్చెనేని- వ్యాధివలన బంధువులకు వ్యధయును, స్వదేశము విడుచుటయును పగవానివలనమునకరాములున్నతనతీక్ష్ణమైన శౌర్యమునకు హానియునుగలుగుననుట.

సింహరవిదశాయాం మీనగురుభుక్తి మాసములు- ౬కి-ఫలం.

మూ॥ వ్యాధిపీడాశనాభావం మధ్యోదుఃఖమహాద్భయం॥
లక్ష్మీనాశంయశోహానింసూర్యేజీవదశాగమె ॥౭౧॥

తా॥ రవిదశయందు మీనగురుభుక్తి వచ్చెనేని- రోగపీడచేనన్నముహితము లేకపోవడము_ నడుమనడుమ దుఃఖము, మృత్యువుశిద్ధించుననిమిక్కిలిభయమును- దరిద్రమును_ కీర్తికిచెరువును- సంభవించును.

సవ్య సింహరవిచక్రదశా సమాప్తా.

---

సవ్య కన్యాబుధచక్ర దశావర్షాః ౯ తత్ఫలం.

మూ॥ కన్యాబుధస్థెశుభకర్మలాభం క్షేత్రాద్రివృద్ధింసుతధ
ర్మవృద్ధిం। స్థూలాంగయుక్తం ప్రియదర్శనంచసుపుష్పశ
య్యాదిషుసౌఖ్యమేతి ॥ ॥౭౨॥

తా॥ కన్యయందు బుధుడుండెనేని- శుభకర్మాలు నడిపించును- భూములుమొదలగువాటికివృద్ధియును పుత్రవృద్ధిని- ధర్మసిద్ధిని- దేహముస్థూలమగుటయును- స్నేహితులదర్శనమును, మంచిపువ్వులవాన్పు మొదలైనవాటియందైన సౌఖ్యానుభవము పొందును॥

భుక్తివాక్యం॥ తులాలికరగోభిమాతుః కుంభో దేహాః కన్యాజీవః॥

భుక్తులఫలములు ధృవం నెల౧ దిబ ౫౭ వి౫ ౩౪.

కన్యాబుధదశాయాం కుంభశనిభుక్తిమాసములు
౫ దినం ౨ గడియలు ౨౮కి ఫలం.

మూ॥ దేహపీడారిపోఃపీడాస్థాననాశంమహద్భయం। అర్థ
నాశంమనఃఖేదంసౌమ్యేశనిదశాగమే ॥ ॥౭౩॥

తా॥ కన్యాబుధదశయందు కుంభశనిభుక్తివచ్చెనేని- దేహపీడను- శత్రు పీడయు- స్థానభ్రంశమును-మిక్కిలిభయమును- ద్రవ్యనాశమును- మనో దుఃఖమును నిచ్చునను ట॥

కన్యాబుధ దశాయాం మకరశని భుక్తిమాసములు
౫ దినం ౨ గడియలు ౨౮కి ఫలం.

మూ॥ బంధనంశూలరోగంచ జ్వరబాధాంధనక్షయః।
నానాక్లేశంచసంవాదంసౌమ్యేమందదశాగమే ॥౭౪॥

తా॥ బుధదశయందు మకరశనిభుక్తివచ్చెనేని- కారాగృహప్రవేశమైన ను, శూలరోగమైనను - జ్వరబాధమైనను. ధనక్షయమైనను, పలుదెరంగు లచేదుఃఖమును, శత్రువుచే వ్యాజ్యమును గలుగననుట.

కన్యాబుధదశాయాం ధనుగ్గురుభుక్తి మాసములు
౧౨ దినం ౨౧ గడియలు ౧౦కి ఫలం.

మూ॥ విద్యాలాభంగురుత్వంచ దేవబ్రాంహణపూజనం। అ
ర్థాలంకారభూషాఢ్యం సౌమ్యేగురుదశాగమే ॥౭౫॥

తా॥ కన్యాబుధదశయందు ధనుగ్గురుభుక్తివచ్చెనేని- విద్యాప్రాప్తియు నాచార్యత్వమును- దేవబ్రాంహణ పూజయును- ద్రవ్యము, అలంకార ము- భూషణమయినిగలవారియందు నాధిక్యమును గలుగును.

సవ్య సింహావలోకనం.

దశాదిసంవత్సరం౧ నెలంది౨౬౭ మీదట సింహావలోకనఫలం.

మూ॥ పితృబంధుమృతింవింద్యాద్బాపాన్మేషగతేవునః।
దేశత్యాగోవిత్తనాశఃజ్వరోభవతి దేహినాం ॥౭౬॥

తా॥ భుక్తినాథుడు ధనుస్సునుండి మేషమందుజేరెనేని- తండ్రికి- బంధు వులకు మరణతరుణమని తెలయవలెను, దేహులకు దేశత్యాగము- ద్రవ్య నాశనము, జ్వరమును గలుగనని తాత్పర్యము.

కన్యాబుధదశాయాంమెషకుజభుక్తిమాసములు౨ది౨౬గ౪౮కి ఫలం॥

మూ॥ అగ్నిదాహంజ్వరంఘోరం బంధుహానిం విషాచి

కాం॥ రాజద్రోహమమిత్రత్వం సౌమ్యేకుజదశాగమే ॥౭౭॥

తా॥ బుధదశయందుకుజభుక్తివచ్చెనేని, నిష్ఫలవలనకాలుటయు-భయంకరమైనజ్వరసంభవము-విషాదియుపద్రవమును, రాజద్రోహమును, స్నేహభావాభావమును గలుగుననుట.

5 కన్యాబుధదశాయాం వృషభశుక్రభుక్తి మాసములు-౨౦దిగ౫౩కి ఫలం॥

మూ॥ ధనలాభంచమిత్రత్వం పుత్రలాభంమహోత్సవం।
ఇష్టార్థసిద్ధిమిత్యేవం సౌమ్యేభృగుదశాగతే ॥౭౮॥

తా॥ కన్యాబుధదశయందు శుక్రభుక్తివచ్చెనేని ద్రవ్యలాభమును, చెలిమియును, సుతోత్పత్తియును- మిక్కిలి సంతోషమును- యిష్టసిద్ధిని, వశ్యము పొందుననుట.

6 కన్యాబుధదశాయాం మిథునబుధభుక్తి మాసములు-౧౦దిగ౩గకి ఫలం॥

మూ॥ ద్యూతవాణిజ్యహోతోశ్చ ద్రవ్యప్రాప్తిం మహోత్స
వం। స్త్రీసౌఖ్యంపుత్రలాభంచసౌమ్యేబుధదశాగమే ॥౭౯॥

తా॥ బుధదశయందు బుధభుక్తివచ్చెనేని, జూదము. బేరము, నీ రెంటినే పమువలన ద్రవ్యలాభమును, మిక్కిలిసంతోషమును, స్త్రీసుఖమును, పుత్రప్రాప్తియును గలుగును॥

7 కన్యాబుధదశాయాం కటకచంద్రభుక్తి మాసములు ౨౬దిగ౨౦గకిఫలం॥

మూ॥ మూకత్వంచక్షయవ్యాధింగురుహానింమనోభయం।
లక్ష్మ్యాదిపశునాశంచసౌమ్యేచంద్రదశాగమే ॥ ॥౮౦॥

తా॥ బుధదశయందు చంద్రభుక్తివచ్చెనేని-మూగతనమును- క్షయరోగమును- నాచార్యునికిజావును- మనస్సుకుభయమును, గుర్రముమొదలగు వాటికిని పశువులకును నాశనమునుగలుగును.

8 కన్యాబుధదశాయాంసింహరవిభుక్తి మాసములు-౬దిగ౦గ౩కి ఫలం॥

మూ॥ క్రమేణద్రవ్యనాశంచరిపుపీడాంమహద్భయం। లక్ష్మీభయసంప్రాప్తింసౌమ్యేరవిదశాగమే ॥ ॥౮౧॥

తా॥ బుధదశయందు రవిభుక్తివచ్చెనేని, వరుసగాద్రవ్యనాశమును-శత్రుపీడను- మిక్కిలిభయమును, దరిద్రమువచ్చునసెడుభయము గలుగునట్టుగలిగించును॥

9 కన్యాబుధదశాయాం కన్యాబుధభుక్తిమాసములు- ౧౧దిగ౩గ౮కి ఫలం॥

మూ॥ దేవార్చనరతోనిత్యమతులంసౌఖ్యమేతిచ। సౌభా
గ్యంజ్ఞానసిద్ధించసౌమ్యేబుధదశాగమే ॥ ॥౮౨॥

తా॥ బుధదశయందు కన్యాబుధచక్రము వచ్చెనేని- దేవపూజయందా సక్తియును, సుభగత్వమును, జ్ఞానసిద్ధియును, సమముతేని సౌఖ్యము నున్- పొందును.

సవ్యకన్యా బుధచక్రదశా సమాప్తా.

---

సవ్యతులాశుక్రచక్రదశావర్షాః- ౧౬ ఫలం.

మూ॥ తౌళిక్షేత్రేశుక్రయుక్తేవామాచారేచరత్యసౌ। కం
ఠలగ్నస్వర్ణమాలాంచిత్రభూషణసంభవం ॥ శృంగార
మందిరంచైవశయ్యాభోగమవాప్నుయాత్। వృద్ధస్త్రీభో
గసౌభాగ్యంధనధాన్యాదిసంభవం ॥ ॥౮౩॥

తా॥ తులారాశియందు శుక్రుడుండెనేని, నీజాతకుడువామాచారమందు చరించును, కంఠమందునంటుకొన్నకంఠియును- చిత్రములైనసొమ్ములును, చిత్తరవులచేవిస్తరించినగృహమును, పాన్పునందలివిశేషసుఖమును, వృద్ధస్త్రీభోగమును సుభగత్వమును ధనధాన్యవృద్ధిని పొందును॥

భుక్తివాక్యం॥ సుదర్శనచక్రజనితా॥ తులాదేహః కన్యాజీవః॥

భుక్తులఫలములు ధృవం నెలలు౨ దినా ౧౨౩ విఘ ౭౪౭.

తులాశుక్రదశాయామాదౌ తులాశుక్రభుక్తి మాసములు
౩౭ దినం-౦ గడియలు ౪౭కి ఫలం.

మూ॥ గీతనృత్యరతించైవ దేహేగంధానులేపనం। కృషి
వాణిజ్యసంప్రాప్తింశుక్రేశుక్రదశాగమే ॥౮౪॥

తా॥ శుక్రదశయందు శుక్రభుక్తివచ్చెనేని సంగీతమందును. నాట్యమందునాసక్తియును, శరీరమందు వాసనగలచందనమునుబూసికొనుటయును, కృషియు, బేరమువ్యాపారసంభవమునిచ్చును.

తులాశుక్రదశాయాం వృశ్చికకుజభుక్తిమాసములు ౧౬ ది ౫ గ ౪౭కి ఫలం॥

మూ॥ పితృహానింజ్వరాత్పీడాంరాజనిగ్రహకారకం। మనో
దుఃఖంభ్రాతృహానింశుక్రేభౌమదశాగమే ॥ ॥౮౫॥

తా॥ శుక్రదశయందుకుజభుక్తివచ్చెనేని తండ్రికిచెరుపును, జ్వరమువలననాయాసము, రాజకోపభాజమును - మనోవ్యాధిని, సోదరులకుమృత్యువునిచ్చును॥

తులాశుక్రదశాయాంచాపగురుభుక్తిమాసములు ౨౩ది ౩గ ౫౯కిఫలం॥

మూ॥ సద్ధర్మశీలసంపన్నం స్వర్ణలాభం మహద్యశః। వి

ద్యాలాభంపుత్రలాభంశుక్రేజీవదశాగమె ॥ ॥౮౬॥

తా॥ శుక్రదశయందు గురుభుక్తివచ్చెనేని- సజ్జనులుకువలెధర్మనియమసమృద్ధియును- ద్రవ్యలాభమును- కీర్త్యతిశయమును, విద్యాప్రాప్తియు-పుత్రలాభమునుబొందుచు.

తులాశుక్రదశాయాం మకరశనిభుక్తిమాసములు-౯ది౭గ౩౪కి ఫలం,

మూ॥ బలహీనంభృత్యపీడాంనగరగ్రామనాయకం। సం
వాదాగ్రహక్లేశంచశుక్రేశనిదశాగమె ॥ ॥౮౭॥

తా॥ శుక్రదశయందు మకరశనిభుక్తివచ్చెనేని- శరీరదుర్బలమును- భృత్యులవలనసంకటమును, పెద్దయూరులకాధిపత్యమును, వివాదముచేగలిగిన కోపముచేనాయాసమును బొందును॥

తులాశుక్రదశాయాంకుంభశనిభుక్తిమాసములు, ౯ది౭-స౩౬కి ఫలం॥

మూ॥ దేహకార్శ్యంరిపోర్బాధాం వ్యాధిదుఃఖమనోరు
జం। మిత్రాణ్యమిత్రతాంయాంతిశుక్రేశనిదశాగతే॥౮౮॥

తా॥ శుక్రదశయందు కుంభశనిభుక్తివచ్చెనేని, శరీరము కృశించుటయును- శత్రుబాధభయమును, రోగమువలనదుఃఖమును- మనఃపీడయును, మిత్రులమిత్రులగుటయును, ఇత్యాది ఫలములబొందును॥

తులాశుక్రదశాయాంమీనగురుభుక్తిమాసములు- ౨౩ది౩గ౪౯కి ఫలం॥

మూ॥ లోహదేర్ధనలాభంచరాజపూజాంశుభైర్యుతం।
పుత్రలాభంజనప్రీతింశుక్రేజీవదశాగమె ॥ ॥౮౯॥

తా॥ లోహము మొదలగువాటివలన ధనలాభమును- రాజపూజనము-నింటియందు శుభములునగుచుండుటయును- పుత్రలాభమును, జనవశీకరమునుబొందును॥

## సన్యసింహావలోకనం.

జన్మాదిసంవత్సరములు౧౨ల నె౧౧ది౨౯గ౪మీద సింహావలోకన ఫలం॥

మూ॥ మీనాచ్చవృశ్చికే యాతెజ్వరంభవతి దేహినాం। స్థా
ననాశంమనోదుఃఖంపితృసోదరపీడనం ॥ ॥౯౦॥

తా॥ భుక్తినాధుడు మీనమునుండి వృశ్చికమందుజేరెనేని, దేహులకు జ్వరబాధయును- స్థానభ్రంశమును- మనఃపీడయును - పినతండ్రిపెత్తండ్రులకు దుఃఖమునుగలుగును- దీనికి సింహావలోకనమనిపేరు॥

తులాశుక్రదశాయాం వృశ్చికకుజభుక్తిమాసములు-౬ది౪గ౮౩కి ఫలం॥

మూ॥ జ్వరంచపితృరోగంచ వ్రణరోగమవాప్నుయాత్ ।

భయోద్భవంచవిరసంశుక్రేకుజదశాగతే ॥ ॥౯౧॥

తా ॥ శుక్రదశయందు వృశ్చికకుజభుక్తివచ్చెనేని, జ్వరమును, తండ్రికి కలిగినరోగమును, వ్రణమును, నిర్నిమిత్తకభయసంభవమును, లోకమంతు నెగతాళియును పొందును.

తులాశుక్రదశాయాం తులాశుక్రభుక్తిమాసములు-౩ దిన-౦గ౨౦కి ఫలం॥

మూ॥కృషిగోధనలాభంచజ్ఞానసౌఖ్యమరోగతాం। స్త్రీప్రి
యంపుత్రలాభంచశుక్రేశుక్రదశాగతే ॥ ॥౯౨॥

తా ॥ శుక్రదశయందు తులాశుక్రభుక్తివచ్చెనేని, కృషియందుయెద్దులావులలాభమున్ను- జ్ఞానసుఖమును, ధనలాభమును, నిరోగతను, స్త్రీప్రియమును, పుత్రలాభమును బొందును॥

తులాశుక్రదశాయాం కన్యాబుధభుక్తిమాసములు ౨౦ది౨౪గ౩౪కి-ఫలం॥

మూ ॥ ధనలాభంకార్యలాభంరత్నలాభంమనోత్సవం । ఇ
ష్టార్థసిద్ధిమాప్నోతిశుక్రేబుధదశాగతే ॥ ॥౯౩॥

తా ॥ శుక్రదశయందు కన్యాబుధభుక్తివచ్చెనేని, ద్రవ్యలాభమును, కార్యసిద్ధియు, రత్నలాభమును,ఇష్టార్థసిద్ధిని, మనోత్సాహమునుబొందును.

తులాశుక్రచక్రదశా సమాప్తా.

---

సవ్యవృశ్చికకుజచక్రదశావర్గాః- ౭ ఫలం.

మూ॥వృశ్చికాంగారకేదాయేజ్వరభారభయావహం।శో
చనాశంశత్రుపీడామగ్నిదగ్ధగృహాంతదా ॥ తదాస్యాదల్ప
బుద్ధించనోవిద్యావస్త్రభూషణం। నసౌఖ్యంభోజనంమం
దంసర్వదష్టైనమారకం। ఇత్యేవంకుజచక్రేణసర్వకార్యం
చనిష్ఫలం ॥ ... ... ॥౯౪॥

తా ॥ జ్వరభారముచే భయమునిచ్చును, ఆచారశూన్యమైయుండును, శత్రుపీడయునునగ్నిచేదగ్ధమైనగృహనివాసమును, నప్పుడప్పుడల్పబుద్ధి గలుగుచుండును చదువుగాని, వస్త్రములుగాని సొమ్ములుగాని లేకయుండును, అసౌఖ్యమును నాలస్యమైన భోజనమును, సర్వదష్టముచేజావునుసిద్ధించునిట్లువృశ్చికచక్రముచే సర్వకార్యముఫలములేనిదియగుననుట ॥

భుక్తివాక్యం॥ వామాంగారకోత్రతునిఃధిః॥ కటకోదేహః- ధనుర్జీవః॥

భుక్తులఫలములు- ధృవంగినఅర్గగరామి|కి.

వృశ్చికకుజదశాయామాదౌకటకచంద్రభుక్తిమాసములు౨ది౧౫చ౨౧కి-

ఫలం॥ మూ॥ ముక్తాఫలస్యసంప్రాప్తింవిద్యాలాభంధనాగమం।
సుఖావహంమహాకీర్తింభామేచంద్రదశాగతె ॥౯౫॥

తా॥ వృశ్చికకుజదశయందు కటకచంద్రభుక్తివచ్చెనేని, ముత్యములుగలుగుటయును విద్యాలాభమును, ధనాగమమును, సుఖావహమును, దొడ్డకీర్తినిఁబొందును॥

వృశ్చికకుజదశాయాం సింహరవిభుక్తిమాసములు- ౪ది-౨౬ గ౩౦కి ఫలం॥
మూ॥ మౌక్తికాంబరభూషాఢ్యం సంగ్రామె విజయంతదా। ధనధాన్యాదిలాభంచభౌమెరవిదశాగతే ॥౯౬॥

తా॥ ముత్యములు వస్త్రములు సొమ్ములకు మేటియగుటయును, యుద్ధమందువిజయమును, ధనధాన్యాదిలాభమును సిద్ధించును॥

సవ్యమండూకగతిః.

జన్మాదిసంవత్సరములు-౨ నెల౧ దిన౧౧ గ౫౨ మీదమండూకగతిఫలం॥
మూ॥సింహేతుమిధునెయాతెస్వస్త్రీవ్యాధిమృతిర్భవేత్।
స్థానచ్యుతింమహాకష్టంజలశస్త్రభయంతదా ॥౯౭॥

తా॥ సవ్యమండూక సమయమందు తనభార్యవ్యాధిచే మరణము, స్థానభ్రంశము, మహాకష్టము, నీటిచేగాని శస్త్రముచేగాని భయమును గలిగియుండును॥

వృశ్చికకుజదశాయాం మిధునబుధభుక్తిమాసములు ౮ది-౨౩ గ౪౩కి ఫలం॥
మూ॥ చోరేణబంధనావాప్తింశుభహానిరిపోర్భయం।అంతదాఽహమవాప్నోతిభౌమేబుధదశాగతె ॥ ॥౯౮॥

తా॥ దొంగలచేదగులుకొని కష్టబడుటయు- శుభకార్యము కులహానియు- శత్రుభయమును, లోపలతపనయునుబొందును॥

వృశ్చికకుజదశాయాంవృషభశుక్రభుక్తిమాసములు-౧౫ ది ౧౮ గ ౪౯కి-
ఫలం॥ మూ ॥ వ్యాధిభిర్వ్యసనైఃకష్ట మతిక్షీతింమనోరుజం। ధనహేతుప్రతాపేనభౌమెశుక్రదశాగతె ॥ ॥౯౯॥

తా॥ వృశ్చికకుజదశయందు శుక్రభుక్తివచ్చెనేని,రోగములచే,వ్యసనములచేతను కష్టమును, ధనవిషయమైన శత్రుత్వముచేగలిగిన మిక్కిలితపనచేమనోదుఃఖమునుబొందును॥

వృశ్చికకుజదశాయాం మేషకుజభుక్తిమాసములు ౬ది-౨౫ గ౭కి ఫలం॥
మూ॥ నృపచోరాగ్నిరోగాచ్చశత్రుజ్ఞాతిముఖాద్భయం।
విషశస్త్రజ్వరైర్బాధాంభౌమెభౌమదశాగమె ॥౧౦౦॥

తా॥ వృశ్చికకుజదశయందు మేషకుజభుక్తి వచ్చెనేని, రాజు, దొంగ, ని
ప్పు, రోగము, వీటివలన ను, శత్రువుజ్ఞాతిమొదలగువారివల ననుభయము
ను, విషము, శస్త్రము, జ్వరమువీట్లచేతను బాధయునుగలిగియుండును॥

వృశ్చికకుజదశాయాంమీనగురుభుక్తిమాసములు-౯ ది-౨౩ గ౦కి ఫలం॥ 6

మూ॥ ఆచారంజ్ఞానసిద్ధించధర్మార్థశుభలాభదం।నృపా
చ్ఛసంపదంనిత్యంభౌమెగురుదశాగమె ॥౧౦౧॥

తా॥ శుచిత్వమును, జ్ఞానసిద్ధియు, ధర్మముయొక్క-అర్థముయొక్క-లా
భమునిచ్చుననియును, రాజువలననెడతెగనికలిమినిచ్చునదియగునని తా
త్పర్యము॥

వృశ్చికకుజదశాయాంకుంభశనిభుక్తిమాసములు ౩ ది-౨౯ గ౧౮కి ఫలం॥ 7

మూ॥ అన్యస్త్రీవ్యసనంనిత్యంభృత్యైశ్చాపహరేద్ధనం । బ
లహీనంసదారోగంభౌమెసౌరిదశాగమె ॥౧౦౨॥

తా॥ వృశ్చికకుజదశయందు కుంభశనిభుక్తివచ్చెనేని, విడువకపరస్త్రీ
యందునాసక్తియును, ధనమును భృత్యులపహరించుటయును- బలహీ
నమునెల్లప్పుడు రోగమునుగలిగియుండుననుట॥

వృశ్చికకుజదశాయాంమకరశనిభుక్తిమాసములు-౩ది-౭గ౧౩కి ఫలం॥ 8

మూ॥ కలహంబంధుభిశ్చైవశతృపీడాంధనక్షయం।కారా
గృహప్రవేశంచభౌమెశనిదశాగమె ॥ ॥౧౦౩॥

తా॥ వృశ్చికకుజదశయందు మకరశనిభుక్తి వచ్చెనేని బంధువులతో కలహ
మును, శత్రుపీడయును, ధనక్షయమును కారాగృహప్రవేశమును బొందును 9

వృశ్చికకుజదశాయాంచాపగురుభుక్తిమాసములు ౯ ది-౨౩ గ౧కి ఫలం॥

మూ॥ శత్రుపీడాదిభిర్ముక్తః ధనలాభంమనఃప్రియం।వైరా
గ్యంలోగసంప్రాప్తిఃభౌమెగురుదశాగమె ॥౧౦౩॥

తా॥ వృశ్చికకుజదశయందు ధనుర్గురుభుక్తి వచ్చెనేని, శత్రువులు మొ
దలగువారిచేవిడువబడిన వాడగుచును ధనప్రాప్తిని, మనఃప్రియమును,
వైరాగ్యమును, రోగావాప్తినిబొందును॥

వృశ్చికకుజచక్రదశాసమాప్తం.

---

సవ్యధనుర్గురు చక్రదశావర్షాః-౧౦ ఫలం.

మూ॥ సర్వస్యాధికరంభాగ్యంసర్వసిద్ధికరంసుఖం। అధికా
రంపుత్రవృద్ధిం వస్త్రాభరణసిద్ధిదం ॥ మిత్రత్వంరాజసన్మా

సంభృత్యాదంబహుపుణ్యదం । కృతప్రతిష్ఠితంభోగంకీర్తిదం
హితమంత్రవిత్ ॥ పరోపకారనిరతంధర్మవృద్ధికరంశు
భం। ధనధాన్యంచసౌభాగ్యంగురుచక్రందదాతిచ ॥౧౦౫॥

తా॥ ధనుర్గురునిదశయందు అన్నిటిని యతిశయించినభాగ్యమును, సర్వకార్యసిద్ధినిజేయునదియును సుఖమైనదియును, యధికారమును, పుత్రలాభమును, వస్త్రాభరణసిద్ధిని, మిత్రత్వమును రాజసన్మానమును, భృత్యులనిచ్చునదియును, విశేషపుణ్యమునిచ్చునదియును, కృతప్రతిష్ఠితమైనభోగమును కీర్తినిచ్చునదియును, హితమైన యాలోచనదెలుపునదియును, పరోపకారాసక్తిని, ధర్మవృద్ధినిచేయునదియును శుభమును, ధనధాన్య సమృద్ధిని సౌభాగ్యమునునిచ్చును.

భుక్తివాక్యం॥ పాపంగావోమాతాసోమాంధి ॥ మేషాదేహఃధనుర్జీవ ॥

భుక్తులఫలములు ధృవంనెలదినకి.

అథధనుర్గురునదశాయాం మేషకుజభుక్తిమాసములు ౮ ది ౧౨కి ఫలం॥

మూ॥ తీక్ష్ణకర్మప్రధానేనయత్నేనలభతేజయం । దానం
సుకీర్తిదంసౌఖ్యం జీవేభౌమదశాగమే ॥౧౦౬॥

తా॥ ధనుర్గురు దశయందు కుజభుక్తివచ్చెనేని, వేడిమియైనకార్యమే ప్రధానముగాగల యత్నముచే జయమునొందుటయును, మంచికీర్తినిచ్చు దానమును, సౌఖ్యమునుబొందును.

ధనుర్గురుదశాయాంవృషభశుక్రభుక్తిమాసములు_౧౯దిటకి ఫలం॥

మూ॥ బ్రాహ్మణైస్సజీవత్వంధనలాభంరిపుఘ్నతాం। పూర్వ
విత్తక్షయంయాతిజీవేశుక్రదశాగమే ॥౧౦౭॥

తా॥ ధనుర్గురుదశయందు శుక్రభుక్తివచ్చెనేని, బ్రాహ్మణులచే జీవనమును ధనలాభమును, శత్రునాశమును, ముందున్న ద్రవ్యక్షయమును పొందును.

ధనుర్గురుదశాయాంమిధునబుధభుక్తిమాసములు-౧౦ది౨౪కి ఫలం॥

మూ॥ వైశ్యేనధనహానించవంచకేనసుఖక్షయం। బంధునా
శంమనస్తాపంజీవేబుధదశాగమే ॥ ॥౧౦౮॥

తా॥ ధనుర్గురుని దశయందు మిధునబుధభుక్తివచ్చెనేని వంచకుడైన వైశ్యునిచే ద్రవ్యనాశమును సుఖమునకుహానియును బంధునాశమును మనస్తాపమునుబొందును.

ధనుర్గురునదశాయాంకటకచంద్రభుక్తిమాసములు౨౪దిటకిఫలం॥

మూ॥ సాహసం ధనలాభంచ రిపుఘ్నం ధర్మసంగ్రహం।
యాసంచ రాజ్య జ్యంచ జీవే చంద్రదశాగమే॥ ౧౦౯॥

తా॥ ధనుర్గురు దశయందు చంద్రభుక్తి వచ్చేనేని తెంపును ధనాగమమును శత్రునాశమును ధర్మసంగ్రహమును పాలకీయును రాజసన్మానమును బొందును.

ధనుర్గురుదశాయాం సింహరవిభుక్తి మాసములు ౬ కిఫలం. 5

మూ॥ యుద్ధే శత్రువినాశంచ భూలాభం రాజపూజ్యతాం।
ధనధాన్యజయోత్సాహం జీవే రవిదశాగతే॥ ౧౧౦॥

తా॥ యుద్ధమందు శత్రునాశమును భూలాభమును రాజసన్మానమును, ధనముచే ధాన్యముచే జయముచే గలిగిన సంతోషమును బొందును.

ధనుర్గురుదశాయాం కన్యాబుధభుక్తి మాసములు ౧౦ ది ౨౪ కిఫలం. 6

మూ॥ పరస్త్రీవ్యసనాసక్తచిత్తః కామవశాకులః। విస్మృ
తాశేషకార్యశ్చ జీవే బుధదశాగమే॥ ౧౧౧॥

తా॥ ధనుర్గురుదశయందు కన్యాబుధభుక్తి వచ్చేనేని పరస్త్రీసంబంధవ్యసనమందు తగులుకొనిన చిత్తముగలవాడును మన్మథాధీనమోటవలన వ్యాకులమును మరచిన సర్వకార్యములు గలవాడగునట.

ధనుర్గురుదశాయాం తులాశుక్రభుక్తి మాసములు ౯ ది ౧౮ కిఫలం. 7

మూ॥ బ్రాహ్మణప్రార్థనాత్ప్రాప్తాం ధనాదృణవిమోచ
నం। జ్ఞానవైరాగ్యసిద్ధించ జీవే శుక్రదశాగమే॥ ౧౧౨॥

తా॥ ధనుర్గురుదశయందు తులాశుక్రభుక్తి వచ్చేనేని బ్రాహ్మణప్రార్థన వలన బొందిన ధనములవలన నప్పు దీరుటయును జ్ఞానవైరాగ్యసిద్ధి బొందును

ధనుర్గురుదశాయాం వృశ్చికకుజభుక్తి మాసములు ౮ ది ౧౨ కిఫలం. 8

మూ॥ తీక్ష్ణకర్మప్రోద్యమనం శౌర్యాత్ శత్రుజయం తథా। జన
స్తుతించ సౌఖ్యంచ జీవే భౌమదశాగతే॥ ౧౧౩॥

తా॥ ధనుర్గురుదశయందు వృశ్చికకుజభుక్తి వచ్చేనేని శత్రువులకు చురుకు పుట్టించు కార్యారంభమును- శౌర్యముచే శత్రుజయమును జనస్తుతిని సౌఖ్యమును బొందును.

ధనుర్గురుదశాయాం ధనుర్గురుభుక్తి మాసములు ౧౨ కిఫలం.

మూ॥ గోలాభం చాశ్వలాభం ధర్మార్థం రాజసేవనం। పుణ్య
ప్రాప్తిర్గురోర్లాభం జీవే జీవదశాగతే॥ ౧౧౪॥

తా॥ ధనుర్గురుదశయందు ధనుర్గురుభుక్తి వచ్చేనేని గోలాభమును, అశ్వ

లాభమును ధర్మార్థలాభమును రాజసన్మానమును పుణ్యప్రాప్తిని, స
ద్గురులాభమును బొందును.

సవ్యధనుర్గురుచక్ర దశాసమాప్తా.

సవ్యమకర శనిచక్ర దశా వర్షాః ౪ ఫలం,

మూ॥ కులాంగనాసమాయోగోపుత్ర దారాదినిగ్రహం। వి
దేశగమనాయాతం మకరే తుదశాగతె॥౧౧౫॥

తా ॥ అన్యుని భార్యతో గూడుకొనుటయును అన్యామోహముచేత ద
న పెండ్లాము బిడ్డలను తరమగొట్టుటయును అన్య దేశమునకు బోపుట
యును సిద్ధించును.

భుక్తివాక్యం॥ నక్షత్రదాసీచర్వణగః॥ మకరో దేహః-మిథునో జీవః॥

భుక్తులఫలములు, ధృవందిన ౧౮౫౮౬-౯|౭,

మకరశనిచక్రదశాయాం మాదౌ మకరశనిభుక్తిమాసములు ౨౭౬౯౮౬ ఫలం

మూ॥ కులజాస్త్రీసమాయోగ పుత్ర దారాదినిగ్రహం। ప
శుపీడామర్థనాశం మందదశాగమే॥౧౧౬॥

తా ॥ అన్యకులాంగనాసంగమపొందుచేస్వాంగనాలింగనభంగమును బి
డ్డలు మొదలగు వారిని త్యజించుటయును- పశువ్యధయును ధన నాశము
నునొసంగును-

మకరశనిదశాయాం కుంభశనిభుక్తిమాసములు ౨౭౬౯౮౬ ఫలం.

మూ॥ జనేభ్యోవ్యధశీలత్వం పుత్ర దారాదినిగ్రహమ్। భృత్య
క్షయం ద్రవ్యనాశం మందశౌరిదశాగమె॥౧౧౭॥

తా॥ జనులవలనదుఃఖనియతమును బిడ్డ పెండ్లాము మొదలగు వ్వారినినిగ్ర
హించుటయును భృత్యులునశించుటయును ద్రవ్యనాశమునుపొందును,

మకరశనిదశాయాం మీనగురుభుక్తిమాసములు ౫౧౯౮౫౫ ఫలం,

మూ॥ నగరగ్రామనాధత్వం పుత్రపౌత్రవివర్ధనమ్ । బం
ధుసౌఖ్యం మహారోగ్యం శనౌజీవదశాదమె॥౧౧౮॥

తా॥ మకరశనిదశయందు మీనగురు భుక్తివచ్చెనేని నగరగ్రామములకధి
కారమును, పుత్రపౌత్రాభివృద్ధిని బంధువులకుకుశలమును మిక్కిలి తనకు
ననామయమునుగలిగించును.

సవ్య సింహావలోకనము.

దశాదిమాసములు౧౦౨౬౫౭ మీదటసింహావలోకనఫలమ్।

మూ॥ మీనాచ్చపృశ్చికేయాతెజ్వరోభవతి దేహినాం । నా

నాక్లేశమవాప్నోతిమాతృబంధువధూమృతిః॥౧౧౯॥

తా॥ భుక్తినాథుడుమీనమునుండివృశ్చికమందు జేరెనేని దేహులకు జ్వరము గలుగుటయును పలువిధములైన దుఃఖములును తల్లి బంధువులు పెండ్లి కూతురు వీరలకు మరణమునుసిద్ధించును.

మకరశనిదశాయాంవృశ్చికకుజభుక్తి మాసములు ౩ది౨౭గ౩౫ఘ ఫలం. 4

మూ॥ దేశత్యాగంజ్వరందుఃఖంశత్రుభిఃపరిపీడనమ్। నిధ
నంనిధనంవైరంమందేభౌమదశాగమే॥౧౨౦॥

తా॥ మకరశని దశయందు వృశ్చిక కుజ భుక్తి వచ్చెనేని దేశమువిడుచుట యును జ్వరమును దుఃఖమును శత్రువులచే మిక్కిలిపీడింప బడుటయును నిర్ధనమును నాశమును విరోధమునుపొందును-

మకరశనిదశాయాంతులాశుక్రభుక్తిమాసములు౯ ది౧గ౮ఘ ఫలం. 5

మూ॥ పుత్రమిత్రాదిసౌఖ్యంచ శోకకోపసమన్వితమ్। స్త్రీ
ద్రవ్యాజీవనంలోభంమందేశుక్రదశాగమే॥౧౨౧॥

తా॥ మకరశనిదశయందు తులాశుక్రభుక్తివచ్చెనేని పుత్రులుమిత్రులుమొదలగు వారికి సౌఖ్యమును వ్యసనము కోపముతో గూడుకొనుట యును, స్త్రీ ద్రవ్యమూలకమైనజీవనమును లుబ్ధత్వమును గలుగుననుట,

మకరశనిదశాయాంకన్యాబుధభుక్తిమాసములు౫ది౨౭గ౨౮ఘ ఫలం, 6

మూ॥ సౌభాగ్యంసౌఖ్యవిజయంబంధుసత్కారసంభవం।
ఐశ్వర్యజ్ఞానసిద్ధించమందేబుధదశాగమే॥౧౨౨॥

తా॥ మకరశనిదశయందుకన్యాబుధభుక్తివచ్చెనేని, సౌభాగ్యమును సౌఖ్యమును జయమును బంధువులకు మిక్కిలియుపకారమును ఐశ్వర్యజ్ఞాన సిద్ధియును గలుగును॥

సవ్యమండూకగతిః.

దశాసం॥ ములు౨నెలది౭గ౭ మీదట మండూకగతి ఫలం.

మూ॥ కన్యాయాఃకటకేయాతేమాతుర్మరణమాదిశేత్।
ఉత్తరాందిశియాత్రేత్యర్థయాత్రా భవిష్యతి॥౧౨౩॥

తా॥ భుక్తినాథుడు కన్యారాశినుండికర్కటకరాశియందు జేరనేని తల్లికి మరణము వచ్చుననియును ఉత్తరమునతీర్థయాత్రాసంభవమునుగలుగును॥ 7

మకరశనిదశాయాంకటకచంద్రభుక్తిమాసములు౧౧ది౭గ౨౭ఘ ఫలం

మూ॥ కార్యహానించమరణంవిద్వేషంచారిపీడనమ్। సర్వదా
కలహంచైవమందేచంద్రదశాగమే॥౧౨౪॥

తా॥ మకరశనిదశయందుకటకచంద్రభుక్తివచ్చెనేని కార్యహానియు, మర ణమును ద్వేషమును శత్రుపీడయును యెల్లప్పుడుకలహమునుగలిగించును.

సవ్యసరణగతిః,

దశాదిసంవత్సరములు ౩ నెలలు ౮ దినములు ౧౪ ంమీదటసర్పగతిఫలం-

మూ॥కటకాచ్చహరింయాతెవ్రణోభవతి దేహినాం। రాజ మూలాద్ద్రవ్యనాశమాప్తబంధువధూమృతి॥౧౭॥

తా॥ దశానాథుడు కటకమునుండి సింహముందు జేరెనేని సర్పగతియని జెప్పగడునది. దేహులకువ్రణములును రాజమూలముగా ధననాశమును స్నేహితులు బంధువులు స్త్రీలు వీరికిజావునుగలుగును.

మకరశనిదశాయాంసింహరవి భుక్తిమాసములు ౧౧ దిం ౯ గ ౨౪ కిఫలం.

మూ॥పుత్రదారాద్రవ్యనాశంశత్రుపీడాంమహద్భయం।ని

జీవనంచవైకల్యంనుందేరవిదశాగమే॥౧౮॥

తా॥ మకరశనిదశయందుసింహరవిభుక్తివచ్చెనేని బిడ్డలు పెండ్లాము ధ నమువీటికి నాశనమును శత్రుపీడయును దొడ్డభయమును బ్రతుకులేకపో వుటయును వైకల్యమునుపొందును,

పునస్సవ్య మండూకగతిః

దశాదిసంవత్సరములు ౩ నెల ౬ దిన ౨౭ గడియలు ౩౨

మీదట పునస్సవ్య మండూకగతిఫలం.

మూ॥సింహాచ్చమిథునేయాతే స్త్రీయోవ్యాధిమృతిర్భవేత్।

ధనధాన్యపశుక్షేత్రబంధుమిత్రాదినాశనమ్॥౧౯॥

తా॥ ఈమండూకగతియందు తనభార్యకువ్యాధిచే మృతిగలుగును- ధన ముధాన్యముపశువులు క్షేత్రబంధువులుమిత్రులుమొదలుగాగలవారికినా శమునుగలుగును.

మకరశనిదశాయాం మిథునబుధభుక్తిమాసములు౫ దిం౨౫ గ ౧౫ కిఫలం,

మూ॥యాగాదిసిద్ధిమారోగ్యంశ్రియంసంపత్కరందా।

గోధాన్యధనలాభంచమందేబుధదశాగమే॥౨౦॥

తా॥ మకరశనిదశయందు మిథునబుధభుక్తివచ్చెనేని యజ్ఞములు మొదల యిన సత్కర్మసిద్ధిని ఆరోగ్యమును లక్ష్మీసంపత్కరమును- గోవులుధ నముధాన్యము వీటిలాభమునుగలుగును,

సవ్యమకరశనిచక్రదశాసమాప్తా.

యందు నపజయమును గలుగును॥

కుంభశనిదశాయాంమకరశనిభుక్తిమాసములు-౨ ది౯ గ౨౮కి ఫలం॥

మూ॥ విరోధంపుత్రసంవాదంమనోవ్యాకులమేవచ। పశు
పీడార్థనష్టంచ శనౌశనిదశాగతే ॥౧౩౪॥

తా॥ కుంభశనిదశయందు మకరశనిభుక్తివచ్చెనేని విరోధమును పుత్రులుతో వివాదమును, మనోవ్యాకులమును పశుహాని, ద్రవ్యహానిపొందును॥

కుంభశనిదశాయాంధనుర్గురుభుక్తిమాసములు-౫ ది౨౩ గ౩౦కి ఫలం॥

మూ॥ ధనాఢ్యస్సేచమూధ్యక్షఃమిత్రలాభోనృపప్రియః।ఐ
శ్వర్యకార్యసిద్ధించమందేగురుదశాగతే ॥ ॥౧౩౫॥

తా॥ కుంభశనిదశయందు గురుభుక్తివచ్చెనేని, ధననాయకుడు, సేనాధిపతియు, మిత్రలాభుడును, రాజులకుప్రియుడునగుచునైశ్వర్యమును, కార్యసిద్ధిని పొందును॥

సింహావలోకనం.

దశావిసంవత్సరములు౨ నె౫ ది౧౮ గ౫౨ మీదట సింహావలోకన ఫలం॥

మూ॥ పితృబంధుమృతింయాతిసర్వకార్యవినాశనం। దేహ
జాడ్యంప్రవాసంచచాపాన్మేషగతేపునః ॥ ॥౧౩౬॥

తా॥ భుక్తినాథుడుధనూరాశియందుండి మేషమునకేగెనేని, తండ్రికిబంధువులకు మృత్యువునన్నిపనులుకుచెరుపును, రోగగ్రస్తశరీరమునుబొందును అన్యస్థలవాసమున్ను గలుగును॥

కుంభశనిదశాయాం మేషకుజభుక్తిమాసములు-౮ ది౧ గ౨౭కి ఫలం॥

మూ॥ఉత్సవంవైభవోపేతంవిత్తంనాశయతిధ్రువం।నృపా
ద్దుఃఖంసమాయాతిమందేభౌమదశాగతే ॥౧౩౭॥

తా॥ కుంభశనిదశయందు మేషకుజభుక్తివచ్చెనేని, విభవసంయుక్తమైనయుత్సవమును, ద్రవ్యమునునశింపజేయును, రాజువలన దుఃఖమునుబొందును॥ కుంభశనిదశాయాం వృషభశుక్రమాసములు-౯ ది౭ గ౩౫కి ఫలం॥

మూ॥ విత్తంధర్మంసదారోగ్యంశోకఘ్నంజీవనంయశః।
పుత్రలాభంచసౌభాగ్యంమందేభృగుదశాగమే ॥౧౩౮॥

తా॥ కుంభశనిదశయందు వృషభశుక్రభుక్తివచ్చెనేని, ద్రవిణమును, ధర్మమును, నెల్లప్పుడనారోగ్యమును, శోకనాశనమును, జీవనమును, కీర్తి, పుత్రలాభమును, సుభగత్వమును గలుగును.

కుంభశనిదశాయాం మిథునబుధభుక్తిమాసములు ౫ ది౬ గ౮కి ఫలం॥

మూ॥ సౌఖ్యమర్థంజయంచైవ స్వేచ్ఛసంసారసౌఖ్యదం।ఐ
శ్వర్యంజ్ఞానసిద్ధించ మందెబుధదశాగమె ॥ ॥౧౩౯॥

తా॥ కుంభశనిదశయందు మిధునబుధభుక్తివచ్చెనేని, సౌఖ్యమునర్థమును, జయమును, స్వేచ్ఛయును, సంసారసౌఖ్యమునునైశ్వర్యమును జ్ఞానసిద్ధిని నిచ్చును॥

సవ్యకుంభశనిచక్రదశా సమాప్తా.

---

సవ్యమీనగురుచక్రదశావర్షాః ౧౦కి ఫలం॥

మూ॥ మీనేజీవేస్థితేతస్మిన్ రాజసేవాభవిష్యతి। ప్రమోదంరాజసన్మానంసర్వాభరణసంయుతం ॥ సప్రతిష్ఠితసౌభాగ్యంక్షేత్రవృద్ధింవివాహకృత్ । సుపుత్రధాన్యవృద్ధించ వస్త్రవృద్ధిసుఖప్రదం ॥ఆస్థానగీతనృత్తంచ తాంబూలాది సుఖప్రదం। సుగంధవనితాభోగభాగ్యవృద్ధింకరోతిచ॥౧౪౦॥

తా॥ మీనగురు దశయందు రాజువద్దయుద్యోగములుగలుగును, సంతోషమును, సమస్తాభరణయుక్తమైనరాజసన్మానమును, నెప్పటికిస్థిరమైననైశ్వర్యమును, క్షేత్రవృద్ధిని, వివాహముచేయునదియును మంచికొడుకులును, ధాన్యవృద్ధిని, వస్త్రసమృద్ధిని, సుఖమిచ్చునదియునునాస్థానమందలిగీతనృత్తమును, మంచితాంబూలము మొదలగువాటిచేమిక్కిలి సౌఖ్యప్రదమును, మంచివాసనలతోగూడినస్త్రీసంభోగసమృద్ధినిచేయుచున్నదియనుట॥

భుక్తివాక్యం॥ వాణీచస్థందధినక్షత్రం॥ మీనంజీవః కటకోదేహః॥

భుక్తులఫలములు ధృవమునెలం౧ది౧౧గ౫౧.

మీనగురుదశాయాంమాందాకటకచంద్రభుక్తిమాసములు౬ది౯గ౪౬కి ఫలం॥

మూ॥ సర్వలాభంసదాప్రీతిం రిపుఘ్నంధనలాభకృత్।రాజప్రీతించసౌభాగ్యంజీవేచంద్రదశాగతే ॥ ॥౧౪౧॥

తా॥ అన్నిలాభము, నెల్లప్పుడు, ప్రీతిని, శత్రునాశమును ధనలాభమును, రాజప్రీతిని,సౌభాగ్యమును గలిగించును॥

మీనగురుదశాయాం సింహరవిభుక్తిమాసములు౬ది౯గ౧౯కి ఫలం॥

మూ॥ వివాహంధనలాభంచకీర్తిందం రాజపూజనం ।పుర గ్రామాధిపత్యత్వంజీవేరవిదశాగమె ॥ ॥౧౪౨॥

తా॥ మీనగురుదశయందు సింహరవిభుక్తివచ్చెనేని, వివాహమును ధన

లాభమును కీర్తికరమును, రాజపూజనమును, గ్రామనుల కాధిపత్యమును చేయును.

మీనగురుదశాయాం కన్యాబుధభుక్తి మాసములు ౧౨ దిన౧౬ గ౪౫కి ఫలం॥

మూ॥ కలహేభయనాశంచ భూలాభం ధనసంగ్రహం । మి
త్రసంతోషమాప్నోతి జీవే బుధదశాగతే ॥ ॥౧౪౩॥

తా॥ మీనగురుదశయందు కన్యాబుధభుక్తి వచ్చెనేని, యుద్ధమందు భయములేమిని, భూలాభమును, ధనసంగ్రహమును, మిత్రునికి సంతోషమును జేయును॥

మీనగురుదశాయాం తులాశుక్రభుక్తి మాసములు ౨౨ దిన గ౪౬కి ఫలం॥

మూ॥ దేవబ్రాహ్మణపూజాంచ క్షుధార్త బ్రాహ్మణప్రి
యం। అంగనాశ్రయమాప్నోతి జీవే భృగుదశాగమే ॥౧౪౪॥

తా॥ మీనగురుదశయందు శుక్రభుక్తి వచ్చెనేని, దేవబ్రాహ్మణపూజను, నాకలిచే పీడితుడగు బ్రాహ్మణునియందు ప్రియమును స్త్రీలననుసరించుటయును బొందును॥

5 మీనగురుదశాయాం వృశ్చికకుజభుక్తి మాసములు ౧౧ ది౨౩ గ౧కి ఫలం॥

మూ॥ క్రూరచిత్తంచ వీర్యంచ బంధుస్త్రీయ మేతిచ। రక్తపి
త్తాదిపీడాంచ జీవే కుజదశాగమే ॥ ॥౧౪౫॥

తా॥ మీనగురుదశయందు వృశ్చికకుజభుక్తి వచ్చెనేని, కఠినచిత్తమును, బలమును, రక్తపిత్తము మొదలగు రోగములపీడను, బంధువులైన స్త్రీలయొకట వైమనస్యమును బొందును॥

6 మీనగురుదశాయాం చాపగురుభుక్తి మాసములు ౧౩ ది౧౮ గ౩౬కి ఫలం॥

మూ॥ ధనంచ పశులాభశ్చ మాంగల్యం పుష్టికం తదా। సుఖ
మన్నేన భోక్తవ్యం జీవే గురుదశాగమే ॥ ॥౧౪౬॥

తా॥ మీనగురుదశయందు ధనుర్గురుభుక్తి వచ్చెనేని, ధనము పశులాభము మంగళములు పుష్టి వన్నముచే సుఖమననుభవింపదగినది॥

మీనగురుదశాయాం మకరశనిభుక్తి మాసములు౫ ది౧౭ గ౨౭కి ఫలం॥

మూ॥ నారీభిః కలహం నిత్యం దూతైశ్చోరైశ్చ పీడనం। గ
జాశ్వమహిషలాభం జీవే సౌరిదశాగతే ॥౧౪౭॥

తా॥ మీనగురుదశయందు మకరశనిభుక్తి వచ్చెనేని, ఎల్లప్పుడు స్త్రీలతో
7 కలహమును, దూతలచేతను, దొంగలచేతను పీడయును, ఏనుగులు గుర్రములు దున్నపోతులు మొదలగు లాభమును గలుగజేయుననుట॥

మీనగురుదశాయాం కుంభభుక్తిమాసములు ౪ దిం ౭ x ౩౭ కి ఫం॥

మూ॥ స్త్రీభోగోమాంగనాలాభఃసంసర్గంతుసుఖంవినా।నా

నాక్లేశమవాప్నోతిజీవేశనిదశాగతే॥ ॥౧౬౮॥

తా॥ మీనగురుదశయందు కుంభభుక్తివచ్చెనేని శరీరమంతయు రో

మములుగల స్త్రీయొక్క లాభమును పెత్తోటి సుఖము లేనిసంసర్గము

నుబలువిధములైన దుఃఖములనుపొందును॥ 8

మీనగురుదశాయాం మీనగురుభుక్తిమాసములు ౧౩ దిం ౮ x ౨౬ కి ఫలం, 9

మూ॥ గోలాభంచాశ్వలాభంచధర్మార్థంరాజసేవనం। పు

త్రప్రాప్తింగురోలాభంజీవేజీవదశాగమే॥౧౬౯॥

తా॥ మీనగురుదశయందుగురుభుక్తివచ్చెనేనిగోలాభమువశ్వలాభముధర్మసి

ద్ధికొరకురాజునుసేవించడమునుపుత్రప్రాప్తియును సద్గురులాభమునుపొం

దును. ఇతిసవ్యచక్రదశాసమాప్తా.

---

అపసవ్యచక్రదశా ప్రారంభః.

అపసవ్యవృశ్చికాంగారకచక్రదశావర్షాః-౭-ఫలం,

మూ॥ అంగారకేవృశ్చికేతు మహాతాపంభవేన్నృణాం।

స్ఫోటకంశత్రుపీడాంచవహ్నిదగ్ధగృహంతదా॥ఆలస్యమ

ల్పబుద్ధించనవిద్యాతురమేతిచ । నసౌఖ్యంనావబోధంచస

ర్వదష్టైనమారకం॥ ఇత్యేవంభౌమచక్రస్యసర్వకార్యేషునిష్ఫలం॥

తా॥ అపసవ్యవృశ్చికాంగారకచక్రదశయందు మిక్కిలితాపముగలుగును,

స్ఫోటకమ్మును శత్రుపీడను నగ్నిచేదహింపబడినమందిరమును నాలస్యము

ను నల్పబుద్ధిని విద్యలేమిని నతురకుక్షిగామిని సౌఖ్యము లేమిని, బోధగత

ప్రజ్ఞలేమిని సర్వదష్టముచేమృత్యువును యత్నించినసర్వకార్యములయం

దునిష్ఫలమునుపొందును.

భుక్తివాక్యం॥ ధనంక్షేత్రంపరాంగమివ॥ ధనుర్జీవకః కటకో దేహః.

భుక్తులఫలములు-ధృవం దినములు ౨౩ x ౧౮ వి॥౧,

అపసవ్యవృశ్చికకుజదశాయామాదౌ ధనుర్గురుభుక్తిమాసములు

౯ ది ౨౩ x ౧ కి ఫలం.

మూ॥ శత్రుపీడావిభిర్మక్తోధనలాభంనృపప్రియం। వై రా

గ్యజ్ఞానసంప్రాప్తింభౌమెగురుదశాగమె॥౧౭౧॥

తా॥ అపసవ్యవృశ్చికకుజదశయందు ధనుర్గురుభుక్తివచ్చెనేని, మనుష్య

డు శత్రువులయొక్క బాధ మొదలగువాటిచే విముక్తియు ధనలాభమును, రాజుప్రియమును వైరాగ్యజ్ఞానప్రాప్తియును జెందును,

అపసవ్యవృశ్చికకుజదశాయాంమకరశనిభుక్తిమాసములు౩ది౨౭గ౧౩కిఫ॥

మూ॥ కలహంబంధువైరత్వంశత్రుపీడాంధనక్షయం। కా
రాగృహప్రవేశంచభామేశౌరిదశాగమే॥౧౫౨॥

తా॥వృశ్చికకుజదయందుమకరశనిభుక్తివచ్చెనేని,కలహము బంధువులతో విరోధము శత్రుపీడ, ధనక్షయము కారాగృహప్రవేశమునుబొందు.

అపసవ్యవృశ్చికకుజదశాయాంకుంభశనిభుక్తిమాసములు౩ది౨౭గ౧౩కిఫ॥

మూ॥ అన్యస్త్రీవ్యసనంనిత్యంభృత్యశ్చాపిహరేద్ధనమ్ । బ
లహీనంసదారోగంభామేశనిదశాగమే॥౧౫౩॥

తా॥వృశ్చికకుజదశయందుకుంభశనిభుక్తివచ్చెనేని అనవరతమన్యయువతిరతియందురతిచేవారివెంటదగులుటయును భృత్యులచే ధనాపహరణము, బలహీనము కలకాలమునొప్పిచేనలయుటయునుగలిగించును.

అపసవ్యవృశ్చికకుజదశాయాంమీనగురుభుక్తిమాసములు౯ది౨౩గ౧కిఫలం

మూ॥ఆచారంజ్ఞానసిద్ధించధర్మార్థశుభలాభకృత్ । నృపై
శ్వర్యప్రదంజ్ఞేయంభౌమెగురుదశాగతే॥౧౫౪॥

తా॥వృశ్చికకుజశయందుమీనగురుభుక్తివచ్చెనేని శౌచము వేదాంతవిచారము ధర్మముకొరకునర్థమును శుభసంపాదనయందు వినియోగపరచుటయు, రాజుకనంతఐశ్వర్యమునిచ్చునని దెలియదగినది.

అపసవ్యవృశ్చికకుజదశాయాం మేషకుజభుక్తిమాసములు౬ది౨౫గ౭కిఫలం

మూ॥ నృపాగ్నిచోరరోగారిమహాబాధాంసుహుర్భయం।
విషశస్త్రభయంచైవభౌమకుజదశాగతే॥౧౫౫॥

తా॥వృశ్చికకుజదయందు మేషాంగారక భుక్తివచ్చెనేని రాజు అగ్ని దొంగలు రోగములు శత్రువులు వీరివలనమిక్కిలి బాధయును మిక్కిలి భయము విషముయొక్కశస్త్రములయొక్క భయమునుగలిగించును॥

అపసవ్యవృశ్చికకుజదశాయాం వృషభశుక్రభుక్తిమాసములు
౧౫దినం౧౭ గడియలు ౫౦ కి ఫలం.

మూ॥వ్యాధిభిర్వ్యసనాయాసైరతిక్షీతిప్రపీడితః । ధనద్వే
షీప్రవాసేచభౌమేశుక్రదశాగతే॥౧౫౬॥

తా॥వృశ్చికకుజదశయందువృషభశుక్రభుక్తివచ్చెనేని మనుష్యుడువ్యాధులచేత వ్యసనములయొక్కఆయాసముచేతగలిగినమిక్కిలిభయముచేతను వి

శేషముగపీడింపబడినవాడగు ధనద్వేషియును ప్రవాసియును నగుననుట.

అపసవ్యవృశ్చికకుజదశాయాం మిధునబుధభుక్తిమాసనులు
౮దినములు౨౩గడియలు౪౩కిఫలం,

మూ॥ చోర ప్రకోపణందుఃఖం శుభహానిం రిపుభయం।
అంతర్దాహమవాప్నోతిభౌమేబుధదశాగతే॥౧౫౭॥

తా॥ వృశ్చికకుజదశయందుమిధునభుక్తివచ్చెనేనిఆమనుష్యునికి దొంగలవల
నఆయాసను అమంగళము శత్రుభయము మనస్సున తపనయునుబొందును,

అపసవ్యమండూకగతిః,

, దశాదిసంవత్సరములు౪ నెలగందిగ౮గ౮మీద మండూకగతిఫలం,

మూ॥ మిధునాచ్ఛహరౌయాతేమాతుర్మరణమాదిశేత్।అ
ధవాస్థాననాశంచజ్వరపైత్యాదిపీడనమ్॥౧౫౮॥

తా॥ అపసవ్యమండూకగమనముమిథునమునుండిసింహమందు జేరెనేనితల్లి
కిమరణముగలుగునని జెప్పవలయుమరియొక పక్షమందుస్థాననాశమైనను,
జ్వరము పిత్తముమొదలగురోగపీడమైననుసిద్ధించును,

అపసవ్యవృశ్చికకుజదశాయాంసింహరవిభుక్తిమాసములు౪ది౨౬గ౩౧కిఫ

మూ॥ మౌక్తికాంబరభూషాఢ్యంసంగ్రామేవిజయంతదా।
ధనధాన్యయుతలాభంభౌమేరవిదశాగతే॥౧౫౯॥

తా॥ వృశ్చికకుజదశయందుసింహరవిభుక్తివచ్చెనేని ముత్యములు వస్త్రము
లు సొమ్ములువీటియొక్క సమృద్ధియు యుద్ధమందు జయమును ధనధా
న్యములతోగూడినలాభమునునిచ్చును.

అపసవ్యవృశ్చికకుజదశాయాం కటకచంద్రభుక్తిమాసములు
౨౦దినములు౧౫గడియలు౨౧కిఫలం,

మూ॥ జ్ఞానసిద్ధింనృపాద్భీతిఃజలవస్తుసమాగమమ్ । వస్త్ర
స్త్రీభూషణంలాభంభౌమేచంద్రదశాగమే॥౧౬౦॥

తా॥ వృశ్చికకుజదశయందుకటకచంద్రభుక్తివచ్చెనేనిజ్ఞానమిచ్చును, రాజా
సన్మానమును, స్త్రీలాభము భూషణలాభమునుసిద్ధించును,

ఇత్యపసవ్య వృశ్చిక కుజచక్రదశాసమాప్తా.

అపసవ్య తులా శుక్ర చక్రదశా వర్షాః ౧౬ కి, ఫలం,

మూ॥ తౌళిక్షేత్రే శుక్రయుక్తేవేదాచారేణవర్తతే।కర్ణేబ
ద్ధలసత్స్వర్ణ మాలాంపిచిత్రతరభూషణః।శృంగారమంది
రంతల్పశయ్యాయాంభోగసంభవం।సౌందర్యయువతీయు

క్తంధనధాన్యంచవర్ధనమ్॥౧౬౧॥

తా॥ తులారాశియందు శుక్రుడుండెనేనినరుడు వేదమందు జెప్పినప్రకారము నడుచును కంతనుండు ప్రకాశించుబంగారుదండయును మిక్కిలి విచిత్రమైనసొమ్మును, అలంకరింపబడినయిల్లును ఆయింటియందలిశయ్యయందుభోగసంభవమును సౌందర్యస్త్రీతోటికూటమి విధనధాన్యవృద్ధిని గలుగును.

భుక్తివాక్యం॥ తాసాంత్రత్సన్నిధి దాసా॥ కన్యాజీవః-తులాదేహః,

భుక్తుల ఫలములు ధృవం నెలలు ౨ దినంగ ౨౩ విగ ౪౦,

అపసవ్యతులాశుక్రదశాయామాదౌకన్యాబుధభుక్తిమాసములు ౨౦ దినం ౨౮ గ ౩౬ కి ఫలం,

శ్లో॥ ధనలాభంవస్త్రలాభం పుత్రలాభం మనోత్సవమ్।
ఇష్టార్థసిద్ధిదంనిత్యంశుక్రేబుధదశాగమె॥౧౬౨॥

తా॥ తులాశుక్రదశయందు కన్యాబుధభుక్తివచ్చెనేని ధనలాభమును వస్త్రలాభమును మనస్సంతోషమును ఎల్లప్పుడు ఇష్టసిద్ధియు బొందుచుండును.

అపసవ్యతులాశుక్రదశాయాంతులాశుక్రభుక్తిమాసములు ౩ ౭ దిం గ ౨౨ కి ఫ

శ్లో॥ కృషిగోధనలాభంచజ్ఞానసౌఖ్యప్రవర్ధనమ్। స్త్రీప్రియంవస్త్రలాభంచశుక్రేశుక్రదశాగతే॥౧౬౩॥

తా॥ తులాశుక్రదశయందు తులాశుక్రభుక్తివచ్చెనేని, కృషిలాభము గోలాభము ధనలాభము జ్ఞానము వలనగలిగిన సౌఖ్యాతిశయమును స్త్రీప్రియమును వస్త్రలాభమును నిచ్చును,

అపసవ్యతులాశుక్రదశాయాంవృశ్చికకుజభుక్తి మాసము ౨ ౧౬ దినము ౪ గడియలు ౮౭ కి ఫల,

శ్లో॥ జ్వరంచపిత్తరోగంచవ్రణరోగంమహద్భయం।క్షుధాదాహంచవైరంచశుక్రేకుజదశాగతే॥౧౬౮॥

తా॥ తులాశుక్రదశయందు వృశ్చికకుజభుక్తి వచ్చెనేని జ్వరము పిత్తరోగము వ్రణములు మిక్కిలిభయము ఆకలి దప్పియు జనులతోటి విరోధము గలుగును, అపసవ్యసింహావలోకనం,

దశ ౨ సంవత్సరములు ౧౬ నెల ౨ దినంగల ౩ మీదట సింహావలోకనఫలం,

శ్లో॥ వృశ్చికేతురుషేయాతేపితృబంధుమృతిర్భవేత్। కళత్రపుత్రమరణంభ్రాతృపక్ష విరోధకృత్॥౧౬౫॥

తా॥ ఈసింహావలోకనమందు తండ్రికిబంధులలో నెవరికైననుమృత్యువును, పెండ్లాముబిడ్డలుకుచావును అన్నదమ్ములలో విరోధమును జేరుచును,

తులాశుక్రదశాయాం మీనగురుభుక్తిమాసములు ౨౩ది౩గ౪౯కి ఫలం,

మూ॥ లోహరత్నార్థలాభంచ రాజపూజాదిభిర్యుతం।
విప్రలాభోజనప్రీతిం శుక్రేజీవదశాగతే ॥౧౬౬॥

తా॥ తులాశుక్రదశయందు మీనగురుభుక్తివచ్చెనేని, సువర్ణము మొదలగు లోహములయొక్కయు, రత్నములయొక్కలాభమును, రాజసన్మానము మొదలగునవిసిద్ధించుటయును పరమార్థోపదేశియగు సద్బ్రాహ్మణలాభమును, జనప్రీతియును గలుగును॥

తులాశుక్రదశాయాం కుంభశనిభుక్తిమాసములు౯ ది౭ గ౩౪కి ఫలం॥

మూ॥ దేహనాశంచోరబాధాంవ్యాధిశత్రుప్రపీడనం। మి
త్రేఘ్నంమానహానించశుక్రేశనిదశాగతే ॥౧౬౭॥

తా॥ శుక్రదశయందు కుంభశనిభుక్తివచ్చెనేని, దేహమునకు చెరుపును, దొంగలబాధయును,వ్యాధిచేతను శత్రువులచేతనుపీడయును, స్నేహభంగమును, మానహానియును గలుగుననుట॥

అపసవ్యతులాశుక్రదశాయాంమకరశనిభుక్తిమాసములు౯ ది౭ గ౩౪ కి-ఫలం॥ మూ॥ మానహానిభృత్యపీడా కళత్రకలహస్తదా। భవే
ద్యుద్ధేప్యపజయఃశుక్రేశనిదశాగతే ॥౧౬౮॥

తా॥ తులాశుక్రదశయందు మకరశనిభుక్తివచ్చెనేని, మానమునకుహాని, భృత్యులవలన పీడయు, పెండ్లాముతోకలహము, యుద్ధమందు నపజయమును గలుగును॥

అపసవ్యతులాశుక్రదశాయాంధనుర్గురుభుక్తిమాసములు౨౩ ది౧౩గ౪౯కి ఫలం॥ మూ॥ సద్ధర్మశీలసంపన్నోరత్నలాభోధనాగమః। విద్యా
లాభోనృపైశ్వర్యం శుక్రేజీవదశాగతే ॥ ॥౧౬౯॥

తా॥ తులాశుక్రదశయందు ధనుర్గురుభుక్తివచ్చెనేని, సజ్జనులకుసమ్మతములైన ధర్మములయందువిడువగూడదనుతలంపు, రత్నలాభము,ధనలాభము, విద్యాలాభమును, రాజుకున్నంతభాగ్యమును గలుగును॥

అపసవ్యతులాశుక్రదశాయాంవృశ్చికకుజభుక్తిమాసములు౧౬ది౪గ౨౪కి-ఫలం॥ మూ॥ పితృహానింజ్వరంపీడాంరాజనిగ్రహకారకం। మనో
దుఃఖంభ్రాతృహానింశుక్రేభౌమదశాగతే ॥౧౭౦॥

తా॥ తులాశుక్రదశయందు వృశ్చికకుజభుక్తి వచ్చెనేని, తండ్రికిచెరుపును, జ్వరమును,దుఃఖమును,రాజుయొక్కనిగ్రహమును, చింతయును,సోదరులకు హానియునుబొందును॥

